# విద్యా విజ్ఞాన

# బాలగీతావళి



పాపగంటి (కలపాల) పుష్పలీల

# Vidya Vignana Baala Geethavali

**by Smt. PUSHPALEELA**

JULY 1990

**Price Rs. 4**



For Copies :

Smt. PAPAGANTI PUSHPALEELA
W/o. Sri Kalapala Krupa Rao
D. No. 20-49/1, Krupanilayam
Narasimhanagar
Chilakalapudi ( P. O. )
Machilipatnam - 521 002

Printed at SPANDANA PRINTERS Machilipatnam

# అభివందనలు

నాపై అవ్యాజంగా అభిమానం కురిపించిన విజ్ఞులు రసజ్ఞులు అయిన పెద్దలందరికీ నా హృదయపూర్వకమైన అభివందనలు.

మొదట నేను, స్వరయుక్త ఆధ్యాత్మిక కీర్తనలు శతాధికంగా రచించి రేడియో " విశ్వవాణి " భక్తిగీతాలలో 1975 నుండి ప్రసారం ప్రారంభించాను. రేడియో ఆడిషన్ అనుమతి పొంది పాడుటకు అవకాశం లభించింది.

భక్తిగీతాలన్నిటిని సంకలనపర్చి " స్వరలహరి " పేరుతో గ్రంథ రూపాన వెల్వరించాను. బాలల విద్యా వికాసానికై నా చే రచింపబడిన బాల గేయాలన్నిటిని, " మధుర గేయ కదంబము " గా ముద్రించి 1987 జనవరి 26 న ఆవిష్కరించుట జరిగింది. నాటి సభకు విచ్చేసిన బాలబంధు బి. వి. నరసింహారావుగారు నా కలం నుండి మరిన్ని బాలలకుపయుక్తమయ్యే గ్రంథాలు వెలుగులోనికి రావాలని వారి నిండు హృదయంతో దీవించారు. వారి అమోఘమైన ఆశీస్సు ఫలించి నా ఈ మూడవ గ్రంథం " విద్యా విజ్ఞాన బాల గీతావళి " గా ప్రచురించ గల్గుటకు సంతోషిస్తున్నాను. సౌజన్యమూర్తులు డా॥ కుప్పా వెంకటరామ శాస్త్రిగారికి నా ఈ చిరుపొత్తాన్ని దొడ్డభక్తితో అంకితమీయగలగడం విశేషంగా భావించుకుంటున్నాను. వారి యెడ నా భక్తిభావం వెల్లడించు కుంటున్నాను.

నా ఈ గ్రంథాన్ని, గురించి ప్రశంసా పారిజాతాలు అందించిన జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ జాన్, మధురకవి మల్లవరపు జాన్‌కవి, బాలబంధు శ్రీ బి. వి. న ర సిం హా రా వు, శ్రీ ఎమ్. ఎస్. శాస్త్రి ( D. D. O. Kakinada ), శ్రీ వడ్డి కృష్ణమూర్తి గారలకు -

అది నుండి నా గ్రంథాలకు అచ్చు అందాన్ని కలిగిస్తున్న సజ్జనులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు ( స్పందన ప్రింటర్స్ ) గారికి, -

నా సాహిత్య కళా కృషికి బాసటగా నిలిచిన నా పతిదేవులు శ్రీ కలపాల కృపారావుగారికి - నా కైమోడ్పులు.

ఇట్లు

సుజన విధేయ

పాపగంటి (కలపాల) పుష్పలీల

# పిల్లలకై గీతాలు

బాలబంధు

**బి. వి. నరసింహారావు**

పిల్లలకై గీతాలు వ్రాయడం అంత తేలిక విషయం కాదు. పిల్లల భావాలకు అనుగుణంగా, వారిని తీర్చిదిద్దే చక్కని మార్గంలో అవి సాగాలి.

'విద్యా విజ్ఞాన బాల గీతావళి' బాల బోధనాత్మకమైనది. చిన్న మాటల చిన్న పాటలు: తేనె ఊటలు బాల బాటలు. రచయిత్రి శ్రీమతి పాపగంటి పుష్పలీల ఈ కవితా వ్యవసాయం చాల ఏళ్లుగా నిర్వహిస్తున్నది. అందులోని మర్మాలను ఆకళింపు చేసుకున్నది. మంచి గాయని; బోధనా వృత్తిధర్మము నిండుగ ఎరిగిన వ్యక్తి. ఆబాలగోపాలం, అధికారుల మన్నన గడించుకున్నది.

ఈ కావ్యాన్ని సౌజన్యమూర్తి, అనుష్ఠాన వేదాంతి, విద్యా విజ్ఞాన స్వరూపులైన డా॥ కుప్పా వెంకట రామశాస్త్రి గారికి అంకితమీయడం ఎంతో సమంజసంగా వున్నది.

పుష్పలీల తన తొలి కావ్యాన్ని ఒక అమృతమూర్తి శాస్త్రిగారికి అంకితమిచ్చింది. మలి కావ్యం సోదరుడు ఆదర్శోపాధ్యాయుడు మోజస్ మోహన్ గారికి కృతినిచ్చింది. ఒక సాధు సజ్జనోపాధ్యాయుడైన శాస్త్రిగారి కుమార్తె. తండ్రికి తగిన పుత్రిక కావడం పుష్పలీల జన్మము ధన్యము.

బోధనాశక్తి, రచనాపాటవం, గానవ్యాప్తి దశదిశలా వ్యాపించడానికి ముఖ్య కారకుడు, ఆమె భర్త శ్రీ కలపాల కృపారావు.

పుష్పలీల తన సేవను ఇతోధికంగా బాలబాలికలకు అందించి విద్యారంగంలో ఒక వెలుగుతారగా ప్రకాశించాలని నా గాఢాభిలాష.

0 0 0

# అభిప్రాయము

– జి. జాన్
కృష్ణాజిల్లా విద్యాశాఖాధికారి

ఏమైఉంటుంది ? పేజీలు తిరగేశాను.
చిన్న పుస్తకం, చిన్న చిన్న పేర్లు, చిన్న చిన్న గేయాలు
రెండోసారి చూచాను - చదివాను
అక్షరాల పొందికలో ఉన్న ఆలోచనలతో వెళ్లాను
మూడోసారి మరలా చదివాను
అక్కడక్కడా ఆగాలనిపించింది
చదివిన గేయం మరలా చదవాలనిపించింది.
మనసును నిలబెట్టి మలుపులు తిప్పడం
మాధుర్యానికి మార్గమె ....
ఈ రోజు పరిశుద్ధ గ్రంథం బైబిలు చదువుతుంటె
" మీరు మార్పు నొంది బిడ్డలవంటివారైతేనే గాని "
అనే వాక్యం ద్వారా నా మనసు మరలా
మలుపు తిరిగింది –
మీ మనసును, మీ హస్తాన్ని దేవుడు నడిపించి
దీవించుగాక.

# పరితోషణ

సీ॥ బడి పిల్లలకు నోట పలికించి, చదివించు
పాఠ్య బోధనల వసారశక్తి
భావి పౌరుల తీర్చి, భారతీయత నిల్పు
నృత్య గేయాల సాహిత్య సృష్టి
స్వరముతో నాకాశవాణి శ్రోతలు మెచ్చు
సంగీత శాస్త్ర విశాల దృష్టి
బహు జనాదరణతో, ప్రభుతలో గౌరవ
మన్నన సాధించుకొన్న ప్రజ్ఞ

తే॥ గీ॥ కలయునన్ చూపె భావనాబలముకొలది,
తెలుగు బాలలు విజ్ఞాన మొలక, నీతి
గీతములు వ్రాసి, ప్రచురించి, జాతికిపుడు
ముదముఁ గూర్చితే ! కవయిత్రి పుష్పలీల ! !

28-933 జవ్వారుపేట
మచిలీపట్నం 521001

వడ్డి కృష్ణమూర్తి కవి

# అభినందన

— మధురకవి మల్లవరపు జాన్

చీమకుర్తి - 523 226 ప్రకాశం జిల్లా

అరుగ దీసిన కొలదిని పరిమళమును
బంచు మంచి గంధపు చెక్క పగిది నీదు
సరస 'బాల గీతావళి' చదువఁ జదువ
పొడము నానంద మతి వేల - పుష్పలీల !

పుష్ప కోమల పద బంధ పుష్టి మెరయు
పుష్ప మాధుర్య భావ విస్ఫూర్తి వెలయు
పుష్ప గంధిల వాక్య విభూతు లొలయు
పుష్పలీల ! నీ కవన మపూర్వ మమ్మ !

నీ వొనరించు సత్కృతుల నిండుదనంబు గ్రహించు "శ్రీకృపా
రావు" సతీమణీ ! సుజన రంజక కావ్య సుమాల గూర్చి వా
గ్దేవి శిరంబునన్ దురిమి దివ్య దిగంత యశో విశాల సం
భావితవై చరింపుమ ! శుభాల వరింపుమ ! శాంతి నింపుమా !

# అంకితము



విద్యా విజ్ఞానముల మర్మాలెరిగిన
మాన్యులు, అనన్య సామాన్యులు
నా యెడ పుత్రీవాత్సల్యము చూపు
పురుషోత్తములు, జ్ఞాననిధులు
డాక్టర్
**కుప్పా వెంకట రామశాస్త్రిగారికి**
నా 'విద్యా విజ్ఞాన బాల గీతావళి' ని
భక్తి పురస్సరంగా అంకితమిస్తున్నాను.

పాపగంటి పుష్పలీల

# విద్యా విజ్ఞాన బాల గీతావళి

మొగలి రేకుల పువ్వులు
ముద్దు వచ్చే మోములు
కల్ల తెరుగని చిన్నలు
తల్లి భారతి పిల్లలు !

# మనదే, మనదే, ఆ జెండా !

## ( జెండా గీతం )

మనదే మనదే ఆ జెండా
ఎగురుచున్నదీ మన జెండా
మూడు వన్నెలై ముచ్చటతో
మధ్యన అశోక చక్రముతో ॥మనదే॥

జాతి పిత బాపూజి బాటలో
ఆశాజ్యోతిగ అవతరించినది.
సాగుచున్నది - శరవేగమున
స్వతంత్ర భారత - సామ్రాజ్యంలో
॥మనదే॥

జాతికి ఖ్యాతిని - పెంచిన జెండ
స్వరాజ్య సమరం - గెలిచిన జెండ
శాంతి ప్రశాంతి - క్రాంతి పథములో
జయము జయము - జయ, జయ, జయజయము
॥మనదే॥

# మరువని మాట

బాపు చూపిన బాట
మా ప్రగతి మాట
మరచి పోనిది నోట
మా స్వతంత్ర్యపు మాట.

# లేత మొక్కలు

లేత మొక్కలు - ఈ చిన్న మొక్కలు
పాల బుగ్గలా - పసిడి బొమ్మలు ॥లేత॥

కళ్ళలోనా - కాంతి వెలుగును
గుండె నిండా - ప్రేమ నిండును
మోము నందు - ముద్దు చిందును
మనసు పాలలా తియ్య నుండును ॥లేత॥

కసిరి కొట్టినా - కాదన లేరు
కరుణ జూపగా - కరిగిపోదురు
వెన్న లాగ వున్న - మనస్సు వేడి చేసినా
కళ్ళల్లో నీరు - కరిగి జారి పోవును ॥లేత॥

కల్ల లెరుగని - తెల్ల కల్వలు
పరిమళించె మల్లె మొగ్గలు
అచ్చ తెలుగు తల్లి ముద్దుబిడ్డలు
విచ్చుకోని - పచ్చి మొగ్గలు ॥లేత॥

# పిల్లల తాత

నెహ్రూ చాచా నేత
పిల్ల లందరికి తాతా
ఎర్రని గులాబి చూపిస్తు
నవ్వుల పువ్వుల నందించు ॥

# బాలలం తీగలం

బాలలం - పిల్లలం
భావి భరత నేతలం
పూతలం - పిందెలం
పరిమళించు - రేపటికి పువ్వులం ॥బాల॥

భరతావని - తోటలో
పెరుగుచున్న మల్లెలం
ఎల్ల దిశల ప్రాకి ప్రాకి
అల్లుకొనే తీగలం ॥బాల॥

కొల్లలైన - మల్లెలం
కోట్లు కోట్లు ఉన్నవి
పరిమళాలు చిందించే
తరుణము రానున్నది ॥బాల॥

# చిట్టి పిల్లలం

చిట్టి పొట్టి పిల్లలము
చిన్న చిన్న పిల్లలము
చిలుక పలుకు పిల్లలము
గిలక తప్పెట మువ్వలము !

చిరునవ్వుల పిల్లలము
చిందు పాల బుగ్గలము
పొన్న చెట్టు మల్లెలము
గిన్నె చెట్టు పిందెలము !

# అవసరం

అ ఆ లు ముద్దుగ
దిద్దుకో బుజ్జాయి
దిద్దుకుంటే నీకు
హద్దు తెలుసును ముందు.

# అక్షరమాల గేయం

అందమైన అక్షరమాల
అదిగో చూడండి
అది గదిగో చూడండి

అ ఆ ఇ ఈ ఉ ఊ
ఋ ౠ ఎ ఏ ఐ
ఒ ఓ ఔ అం అః
క ఖ గ ఘ ఙ
చ ఛ జ ఝ ఞ
ట ఠ డ ఢ ణ
త థ ద ధ న
ప ఫ బ భ మ
య ర ఱ ల ళ
వ శ ష స హ క్ష ॥అం॥

ఏబది ఆరు యీ పూలు
అక్షరమాలకు అక్షరాలు.

అందమైన మల్లెపూలు
కొప్పును మురిపించు
అక్షరమాల అక్షరాలు
మనసును వెలిగించు
మరి జ్ఞానం కలిగించు

కలమున విరిసె
కమ్మని పదములు
కలకాలం మన
కరమున నిలిచి
విరియును ముత్యాల
సరముల రీతి !

# అదిగో బడి గంట

అమ్మా నాకు అన్నం బెట్టు
అదిగో బడి గంటా ! అల్లదిగో
బడి గంటా ! !
గణ గణ మంటు కొడతున్నారు
అందరు పిల్లలు పోతున్నారు !
టాంగ్ టాంగ్ టాంగ్ ! మంటు
ఒకటో బెల్లు కొట్టారు వంపులు
తిరుగుచు వయ్యారంగ గుంపులు
గుంపులు పోతున్నారు !
టాంగ్ టాంగ్ టాంగ్ ! మంటు
రెండో బెల్లు కొడతున్నారు
రెప రెప లాడుతు పోతున్నారు
బారులు తీరి నిలుచున్నారు
వందేమాతరం అంటున్నారే !

## అర్థం

ప్రొద్దున్నె ఆ కోడిపుంజు లేస్తుంది
కొక్కు-రోకో యంటు - కూస్తుంది రోజు
కొక్కు-రోకోయనగ అర్థ మొకటుంది
ఒక్క-డే దేవుడని - నొక్కి- చెబుతుంది !

## నిజమైన బొమ్మలు

రంగు రంగుల బొమ్మలు
కొండపల్లి బొమ్మలు
రంగులు వేసిన బొమ్మలు
దేవుడి గుళ్ళో బొమ్మలు
భగవంతుని బొమ్మలు
బళ్లోని పిల్లలు ! !

## వింత

పువ్వులు లేక పిందెలు రావు
పిందెలు రాక కాయలు కావు
పిల్లలు కాక పెద్దలు కారు
క్రొత్తొక వింత పాతొక రోత !

## తెల్పుకొనుట

అద్దంలో అందం కనిపిస్తుంది
నిద్దరలో స్వప్నం మురిపిస్తుంది
అబద్ధం ఆపద కలిగిస్తుంది
అందరితో ఐక్యత ఆనందం అనిపిస్తుంది !

## సొంతం

అల్లరి చెయ్యక కూచోమంటె
అఆ లెట్లా చెప్పాలి ?
అరచి అరచీ అఆలన్నీ
చెప్తే అల్లరి కాదా మరి !

## ఉపయోగము

చదువు చెప్పు గురువు చేత
బెత్త మెందు కుండునో !
చదవ నట్టి పిల్లలను
సరిగ దిద్దు కొనుటకె !

## హితవు

చేతికున్న నీ వేళ్ళకు
గోళ్ళు పెంచకూడదు
ఆద మరచి గీరుకున్న
అదే పెద్ద పుండు అగును !

## రక్షణ

ఆకుల్లోని పచ్చని చిలుక
అందరికి కనిపించదెందుకు
కనిపిస్తే కసి దీరగ పిల్లలు
కొట్టి పట్టి చంపేస్తారని !

## శిక్ష

కొట్టొద్దు తిట్టొద్దు
కొట్టి చదువు చెప్పొద్దు
ముద్దు ముద్దు మాటలతో
మురిపిస్తే చాలు - మరి
చదువుతారు బాలలు !

# ఇష్టం

అల్లరి జేసే పిల్లలకు
ఆటా పాటా ఎంతో ఇష్టం
ఆటా పాటా కలిపే మాకు
అఆలను దిద్దించండి !

# న్యాయం

బడిలో పిల్లలు తింటుంటేను
బెత్తం బట్టి కొట్టేస్తారు
చిత్తుగ మత్తుగ బీడీ ముక్కలు
పంతులుగారె పీలుస్తారు
చెప్పిన మీరే చెడు చేస్తుంటే
చిన్న పిల్లలకు చింతలు రావా !

# అలవాటు

కాకి ఒకటి ఇంటి ముందు
కావు కావు మన్నది
పాల కుండ చూచి పిల్లి
మ్యావ్ మ్యావ్ మన్నది !

# సందేహం

జామచెట్టు పైకి చిలక చేరుకున్నది
చకా చకా జామపండ్లు కోసి తిన్నది
అమ్మా ! ఆ చిలకమ్మకు, జలుబు చేస్తదే
తినవద్దని చెప్పవే చిట్టి చిలకకు !

# స్వర్గం

అమ్మ ఒళ్ళో పాప ఆడుకుంటుంది
తూగుతూ ఉయ్యాల వూగుతుంటుంది
అమ్మ మోమును జూచి మురిసిపోతుంది
వడి నందె స్వర్గాలు తేలుతుంటుంది !

# వాసన

నోరు లేని పూల గాలి
వాసనెంత కమ్మనో,
కడగకుండ చూడు నోరు
వాసనెంత రోతయో !

## రంగులు

గుమ్మడి పూవు పసుపు
గురిగింజ ఎరుపు
గోపాలుడు నలుపు
గోగుపువ్వు తెలుపు.

## నిజాలు

కాకి నలుపు
మేక నలుపు
చీమ నలుపు
చీకటి నలుపు
ద్రాక్ష నలుపు
రాక్షసి బొగ్గు నలుపు
కొండ నలుపు
కొండ ముచ్చు నలుపు
కొమ్మ నలుపు
కోయిలమ్మ నలుపు
తారు నలుపు
తరాజు నలుపు
అమాస నలుపు
అసత్యం నలుపు

# మధురం

పాలు తేనెలు మధురం
పాయసం మధురం
పానీయాలు మధురం
పంచదార మధురం
ప్రేమ మాట మధురం
ప్రీతి ముద్దు మధురం
తియ్యని పాట మధురం
అమ్మ మాట మధురం

# మంచి నేస్తం

పల్లవి :- నేస్తం నేను చేస్తా
నే, నచ్చిన - నేస్తం చేస్తా ॥నే॥

దొరగారైతే - నేస్తం చేస్తా
దొంగోడైతే - నే వచ్చేస్తా ॥నే॥

తప్పుడు మాటలు - చెప్పేస్తుంటే
తప్పుకు తప్పుకు - తిరిగేస్తా ॥నే॥

ఎప్పుడు బడికీ - ఎగనామేస్తే
తప్పక స్నేహం - మానేస్తా ॥నే॥

వేళకు బడికి - వచ్చేస్తుంటే
చేతికి చేయి - అందిస్తా
చెట్టా పట్టా - వేసేస్తా
స్నేహం నేను - చేసేస్తా ॥నే॥

# తెలుపు

మల్లెపూవు తెల్లన
ఉల్లిపాయ తెల్లన
ఎల్లుల్లి తెల్లన
నందివర్ధన తెల్లన
నవనీతం తెల్లన
పాలు పెరుగు తెల్లన
పంచదార తెల్లన
పసిడి మనసు తెల్లన
పరమాత్ముడు తెల్లన!

# చల్లని రాజ్యం

పిల్లలము - పిల్లలము - కొల్లలము
నవభారత రేపటి యువ నేతలము

చాచా నెహ్రూ తాత ఆశలము
పూసే పూదోటల పువ్వులము ॥పిల్ల॥

విరిసిన ఎర్రని జేబు గులాబీలము
మెరిసే పగడాల ప్రగతి పూసలము ॥పిల్ల॥

అందరిని అలరించే చిన్నారులం
కన్నతల్లి మా భారతి కలల పంటలం ॥పిల్ల॥

ఎల్లలు లేనట్టి మా పిల్లల రాజ్యం
కల్లలు లేని మా చల్లని రాజ్యం ॥పిల్ల॥

# సంక్షేమ గేయం

బాలల్లారా ! భావి పౌరుల్లారా
భారత దేశం, మీదే, మీదే
రేపటి భారం - మీదే, మీదే ! ॥బా॥

దేశప్రగతి - పురోగతిని చూసు
నేటి జనాభ - ప్రవాహంను చూసు
తిరోగమించుము - పురోగమించుము
పెరుగుచున్న జనాభను తరిమికొట్టుము ॥బా॥

రానున్నదీ - ఘోర ప్రమాదం
గాలి, నీరు - దొరకని దుర్దినములు
వ్యాధి బాధలెక్కువై - నిలువ నీడ తక్కువై
సౌఖ్యమె నశించును - సుఖశాంతులు తరుగును
॥బా॥

బ్రతుకు బాట కడ్డంకులు - ఏమిటనీ !
పెరుగు జనాభయే - మేటి కారణం అనీ !
కర్తవ్యం గుర్తించు - సంక్షేమం చాటించు
విజయానికి సారథివై - జనాభ రేఖ తొలగించు
॥బా॥

# కోరిక

చెల్లి : అక్కా నీతో - బడి కొస్తానె
అచ్చంగాయలు - తెస్తావంటె !

అక్క : అచ్చంగాయలు - ఆడుకుంటె
ఆట లెట్లా - వస్తాయమ్మా !

చెల్లి : అక్కా నీతో - బడి కొస్తానె
బెల్లం ముక్క - తెస్తావంటె !

అక్క : బెల్లం ముక్క - చేతిన వుంటె
చీమలు నిన్ను - పట్టేస్తాయి !

చెల్లి : అక్కా నీతో - బడి కొస్తానె
గురుగులు - కూడ తెస్తావంటె !

అక్క : గురుగులు - బళ్ళో ఆడుతుంటె
గురువులు - చూస్తే వూరుకోరె !

చెల్లి : అక్కా నీతో - బడి కొస్తానె
ఐస్ ఒకటి - కొని యిస్తావా !

అక్క : ఐను, గీయును; తిన్నావంటె
ఆరోగ్యం చెడిపోతుందమ్మా !

చెల్లి : అట్లాగైతే - రానె అక్కా
నువ్వే వెళ్ళిపోవె బడికి !

# జ్ఞానేంద్రియములు

## అభినయ గీతం

టీచరు - ఒక్కటి, రెండూ, మూడు, నాల్గు ఐదు
ఉన్నవి నీలో చూడు - పంచేంద్రియాలు ఐదు

మల్లెపూవులు ఇస్తే నీకు ఏంజేస్తావో చెప్పు
వాసన ఎట్లా చూస్తావు ?

విద్యార్థి - భలే, భలే, - కమ్మని వాసన కలిగిన పూవు
వాసన చూస్తాను ముక్కుతో వాసనచూస్తాను

టీచరు - లడ్డూ యిస్తే నీకు నేను ఏంజేస్తావో చెప్పు
నువ్వు ఏం జేస్తావో చెప్పు !

విద్యార్థి - భలే భలే, నోరూరించె తియ్యని లడ్డు తింటా
నేను నోటితో - తింటా నేను నోటితో

టీచరు - రంగు రంగుల బొమ్మల్ని యిస్తే, ఏంజేస్తావో
చెప్పు - నువ్వు - ఏంజేస్తావో చెప్పు ?

విద్యార్థి - భలే భలే, జ్యోతులవంటి కనుదోయితలతో
చూస్తా రంగులు నేను, చూసి సంతోషిస్తాను

టీచరు - వీనుల విందగు సంగీతము - ఎట్లా వింటావో
చెప్పు ఎట్లా వింటావో ?

విద్యార్థి - భలే భలే – చెంపకు వున్న చేరడు చెవితో
వింటా - నేను సంగీతం - వింటా నేను గింగీతం.

టీచరు – చెప్పకుండ చీమ కుడితే ఏం జేస్తావో చెప్పు
నువ్వు ఏం జేస్తావో చెప్పు.

విద్యార్థి - భలే భలే, - చురుక్కుమంటు చర్మంకుడితే,
చేత్తో పట్టేస్తా - చీమను క్షణములో చంపేస్తా.

# గురు భక్తి

గురువు నందు భక్తి
శ్రద్ధలను నిలుపుము
పెరిగి నీ జ్ఞానము
వర్ధిల్లు ధరలోన.

# అందని పొందు

అందమైన చందమామ
అక్కడ వుందేంటే అమ్మా!
ఆడుకుంట దానితో,
రమ్మని చెప్పవే!

అందదు నాకు చందమామ
ఎందుకు చెప్పవే! అమ్మా!
ఎప్పుడు దగ్గర చేరాలన్న
దూరం జరిగి పోతుంది!

కొండలు ఎక్కి కూర్చుంటుంది
నన్నే నిత్యం చూస్తుంటుంది
కోపం వచ్చి కొడదామంటె
దొంగ వలె మబ్బుల్లో దాగివుంటుంది.

నే పరుగిడితె పరుగిడుతుంది
నా వెనకాలె వచ్చేస్తుంది
నే కూచుంటె కూచుంటుంది
నే నిలబడితే నిలబడుతుంది!

చుక్కలనన్ని చేరదీస్తది
నన్నే చిన్నెలు చూపిస్తుంది
వెన్నెల వెలుగు కురిపిస్తుంది
మనసుకు హాయి కలిగిస్తుంది!

# రెండు పిల్లులు - రొట్టె ముక్క

## (కథా గేయం)

రెండు పిల్లులు రొట్టె ముక్కను
తెచ్చు కున్నవి - మర్రి వ తోడ
చెట్టు క్రింద - చేరినవి
చెరి సగమని - కోరినవి ॥

నాకు పెద్ద నీకు చిన్న
ముక్కలనుచు భేదమున
తగవు బెట్టు కున్నవి
తన్ను లాడుకున్నవి ॥

అదును జూచి పదును జూచి
తగవులాట తీరు జూచి
కోతి బావ పలుకరించె
తగవులాట ఎందుకని ॥

కథను విన్న కోతి బావ
కంత తెలిసి పోయెను
రొట్టె తాను తినగను
ఇట్టె పన్నె కిటుకును ॥

రొట్టె తాను చేతబట్టి
ముక్కలుగ విరిచెను
త్రాసునందు పెట్టితాను
హెచ్చు, తగ్గులు తినుచును ॥

మిగిలి యున్న ఒక్కముక్క
చేతబట్టి చెంగున
చెట్టుపైకి చేరెను
కిచకిచ మని నవ్వెను ।

బిక్కమొగము వేసికొని
వీపు బిగబట్టుకొని
మోసమంత తెల్సుకొని
ఆకలితో పిల్లులు ఇంటి దారి బట్టెను ॥

# గౌరవము

పెద్దలను ప్రేమతో
గౌరవించుము నేడు
గౌరవింతురు నిన్ను
పెద్దవైన రేపు.

# ఆరోగ్య మార్గం

చిట్టిపొట్టి పిల్లల్లార
చదువును నేర్చే బాలల్లార
అందమంటె _ ఏంటి ?
ఆనందమంటె _ ఏంటీ ॥

అందమంటె సోయగము
ఆనందమంటె ఆరోగ్యం
అన్నీవున్నా అది లేకుంటె
అనారోగ్యమె శరణం శరణం ॥ ॥చిట్టి పొట్టి॥

ఆరోగ్యమె మహాభాగ్యం
అదియె మనకు ఆనందం
ఆనందముంటె జీవితమె
సుఖము శాంతి సౌభాగ్యం ॥చిట్టి పొట్టి॥

శరీర మందు భాగాలు
కళ్ళు ముక్కు చెవులు
కాళ్ళు చేతులు నోరు
శుభ్రముగ నవి వుంచాలి ॥చిట్టి పొట్టి॥

బ్రష్‌తో పళ్ళను బాగా తోమి
నోటిని శుభ్రం చెయ్యాలి పండ్లను
బాగ కడగాలి, దాగిన ముక్కలు
పోవగ నీళ్ళను పుక్కిలి పట్టి వుయ్యాలి ! ॥చిట్టి॥

కళ్ళను మంచి నీటితో కడిగి
శుచిగా నుంచాలి, రక్షణ నిచ్చు
రెప్పలు నీకు చిరు దీపంతో చదవద్దు
కన్నే నీకు జీవన వెలుగు ॥ ॥చిట్టి పొట్టి॥

తలపై వున్న నల్లని కురులకు
నూనెను దినము రాయాలి
మురికి పోవగ సీకాయతో
స్నానం మరువక చెయ్యాలి ॥ ॥చిట్టి పొట్టి॥

భుజించు వేళకు ముందుగ నీవు
కాళ్ళు, చేతులు కడగాలి, వేళ్ళ,
గోళ్ళకు అంటిన మురికి సబ్బుతో
శుద్ధి కడగాలి, చేతులు కాళ్ళు కడగాలి. ॥చిట్టి॥

ఈగలు దోమలు వాలినదేది
ఆహారంను తినవద్దు, వండిన
వెంటనె వేడిగ అన్నం తినవలయు,
చెడు కలిగించె చిరుతిండ్లను తినవద్దు ॥చిట్టి॥

పండ్లు పాలు మానక తినుము
రోగము ఎన్నడు చేరవు నిన్ను
ఆయుష్కాలం పెరుగును నీకు
ఆరోగ్యమార్గం అవలంబించు ॥చిట్టి పొట్టి॥

# ప్రయోజన విద్య

## ( సంగీత నృత్య రూపకము )

పుల్లమ్మ : రారాద - ఎంకమ్మ
రాత్రిపూట - చదువుకు
పొద్దు బోక - ముందె
పడుకుంటె - బాగోదు
ఊసులాడు - కొంటేను
వచ్చేది - ఏముంది
కాలక్షేపణ - కోసం
కాసేపు - చదివద్దాం ! ॥రారాద॥

ఎంకమ్మ : చాల్లేవె - పుల్లమ్మ
సరసమాడు - తున్నావ
సరిపెట్టు - నీ గోల
చాలించు - నీ మాట ! ॥చాల్లేవె॥

పుల్లమ్మ : సరసమెందుకె - పిల్ల
విరసమె - చెబుతున్న
చదువత్తె - మనకెంతో
మేలు - సంబరాలె
మన - బతుకు చూడు ! ॥రారాద॥

ఎంకమ్మ : చాల్లేవె - పుల్లమ్మొ
సరిపెట్టు - నీ మాట
ఓనమాలు - రాకుండ
వరుసలే - దిద్దకుండ
వస్తాదా - ఆ చదువు
పుల్ల మ్మో - వద్దులే
ఆ చదువు - పుల్లమ్మో ! ॥చాల్లేవె॥

పుల్లమ్మ : చదువుకుంటే - మనకు
నాజూకు - వత్తాదె
చెంగులన్ని - ఇప్పుకొని
సరదాగ - నడవచ్చు
వాలుజెడ - ఏసుకుని
ఇనురుకుంట - నడవచ్చు
చేతికి - గడియార మెట్టి
సిప్పుర్లె - ఏసుకొని
చంక బాగ్ - తగిలించి
చెక, చెక - నడవచ్చు
పోదాము రావె ఎంకమ్మొ
ఈ పూట - రాత్రి బడికి ఎంకమ్మ !
॥రారాద॥

ఎంకమ్మ : అమ్మో మా బాబింటె
బతకనిత్తా - డంటె
కట్టుకునోణ్ణి - డింటె
కొంప మునిగి - పోదంటె
వయసు - మళ్ళి పోయింది
మనసు - తరిగి పోయింది
మనము - చదువుకుంటుంటె
నలుగురూ - నవ్విపోరా
నోటి మీద - ఏలేసి
సిగ్గు సిగ్గు - అనుకోరా
మన కెందు కె - సదువు పుల్లమ్మో
మాటాడబోకె - పుల్లమ్మో ! ॥చాల్లేవె॥

పుల్లమ్మ : పాత కాలం - పాట
పాడొద్దు - ఎంకమ్మ
రోకటింటి - పాట
రోజు లియి - కావమ్మ
తోలు బొమ్మల - కాలం
తొంబై ఏళ్ళ నాటిదమ్మ
మూగ బొమ్మల సిల్మ
ముప్పై ఏళ్ళ నాటిదమ్మ

సదేశాల సంగతైన
విదేశాల సంగతైన
చిటికెలోన మన ముందు
కనిపించు కళ్ళముందు
కలకు, బలుగు టిబిలు
కంప్యూటర్ కాలమె
ఎంకమ్మొ కాలమెంత
మారిందె ఎంకమ్మ
రాజెవరో రెడ్డెవరో ఎంకమ్మ?
రోజులు మారాయిగదా ! ఎంకమ్మొ ?

॥రారాద॥

ఎంకమ్మ : చదువు రాక పోతేను
సాగదా మన బతుకు
తాత ముత్తాత లంత
ఏం చదివారో చెప్పు
చదవకున్న వాళ్ళంతో
చక్కగాను బతికారు
పెద్ద చిన్న - తేడాలను
చూపెట్టి - మసిలారు
సంఘంలో - కుళ్ళు లేక
సమానంగ - చూసారు
పాతకాల మది కాదె పుల్లమ్మా !
బంగారం కాలమె పుల్లమ్మొ (అది) ॥చాల్లే వె॥

పుల్లమ్మ : బంగార - మెమొగాని
సింగార - ముండదుగ
చదువుసార _ మెరుగకున్న
సంతలోని _ పసువేగ
బతుకు భారమును - మోసె
బండి లాగు - ఎద్దులుగ
ఉండరాదె - మనం ఎంకమ్మ
మారవలె - మనం కూడ ఎంకమ్మో !
॥రారాద॥

ఎంకమ్మ : చదువుకున్నోళ్ళకి
చాన – గర్వమంటారు
కస, బిస ఇంగ్లీసులో
చెడ మడా తిడతారు
సదువుకున్న తెలివంత
వలక బోత్తుంటారు
తోటి వారంటేనె
చిన్న చూపు సూత్తారు
మాయ మర్మ మెరుగని
మోటువాళ్ళం టేను
ముసి ముసి నవ్వులు నవ్వి
మహా పోజు - కొడతారు
మానవత్వమే - మరచి
బతుకుతూ వుంటారు

నా కొద్దై - ఆ చదువు పుల్లమ్మో !
రాత్రిపూట - చదువులు పుల్లమ్మో ?
॥చాల్లే॥

పుల్లమ్మ : అది కాదె - ఎంకమ్మ
చెప్పేది వినవమ్మ
అందరెందు - కుంటారు
ఒక్క - జాబితాలోనె
అందరొక్కటనరాదు
అనుమానం - పడరాదు
లోకమంటె - మనుషులేగ
ఇంతేగ లోకమంత
చూచి చూడక - మనం
మంచిని చేపట్టుదాం
చదువులోనె - విలువుంది
సారముంది - అందులోనె
ఎనకాడబోకె - ఎంకమ్మో !
బడికి ఎల్దాము - రావె ఎంకమ్మో !
॥రారాద॥

ఎంకమ్మ : చదువు - కున్నోళ్ళంతా
చతికిల - బడి ఉన్నారు
యం ఎలు - బియ్యేలు
ఎలగబెట్టి - వాళ్ళంతా

ఉద్యోగం - ఊసులేక
పొద్దుబోక - తిరుగుతారు
చదువు మనకెందుకె - పుల్లమ్మా !
చాలించు నీ గోల పుల్లమ్మా ॥చాల్లేవె॥

పుల్లమ్మ : ఉద్యోగం - మనకొద్దు
చదువు - విలువ చెబుతున్నా
ఓట్లు రాయ - వత్తారు
పేరు చెప్ప - మంటారు
సంతకం - పెట్టమని
పుస్తకం నీ కిత్తారు
ఎగా దిగా చూత్తారు
ఏం తోచక - ఉంటావు
సంతకం - రాదంటే
సిగ్గేస్తది - నీకు
వేలి ముద్ర ఎయ్యమంటె
ఎదవాత్తదీ - నీకు
నలుగురిలో నవ్వుపాలు
నీ కొస్తదీ ! నా మాట
నమ్మవే ! ఎంకమ్మా నిజం
నా మాట నమ్మవే ఎంకమ్మా !
అందుకే ॥రారాద॥

ఎంకమ్మ : ఔనే! ఒ పుల్లమ్మ
నీ మాట నిజమమ్మ
సంతకం నా కసలె
రాదమ్మో సరె పద
పోదాము పుల్లమ్మో!

ఇద్దరు : రారండి మీరంతా
రాత్రిపూట బడులకు
సంతకం ఒచ్చేదాక
చదువు కుందాము
సంబరాలె మన బతుకు
చేసుకుందాము - పద ॥రారండి॥

0 0 0

# అంకెల వరుస

ఒకటి ఒకటి రెండు
నోటికి పెదవులు రెండు
రెండు ఒకటి మూడు
ముక్కు కళ్లు మూడు
మూడు ఒకటి నాలుగు
కాళ్లు చేతులు నాలుగు
నాలుగు ఒకటి ఐదు
చేతికి వ్రేళ్లు ఐదు
ఐదు ఒకటి ఆరు
చీమకు కాళ్లు ఆరు
ఆరు ఒకటి ఏడు
వారం రోజులు ఏడు
ఏడు ఒకటి ఎనిమిది
భూమికి దిక్కులు ఎనిమిది
ఎనిమిది ఒకటి తొమ్మిది
నవధాన్యాలు తొమ్మిది
తొమ్మిది ఒకటి పది
ఒకటి సున్న పది.

## వారముల వరుస

ఆదివారం వచ్చింది
సోమవారం రేపంది
మంగళవారం మళ్ళంది
బుధవారం రమ్మంది
గురువారం వచ్చింది
శుక్రవారం చూసింది
శనివారం శరణం అంది

## సహజాతాలు

బూచాడు వస్తాడు
బుట్టనే తెస్తాడు
రాకాసి వస్తుంది
రక్కి పోతుంది

చందమామ వస్తుంది
వెన్నెల్లు తెస్తుంది
చెడ్డోడు వస్తాడు
చెవి గిల్లి పోతాడు
మంచోడు వస్తాడు
మనసు చల్లగ చేస్తాడు.

# అదే మన జెండ

అదిగో అదిగో మన జెండ
ఆకాశంలో ఎగిరె జెండ

అదే అదే మన భారత జెండ
స్వరాజ్యం సమరం పూలదండ

అందరి ఆశల భావన జ్యోతి
కొందరి ఆత్మల త్యాగ ప్రతీక

కులాల మతాల ద్వేషపు జ్వాల
నిజాల మాటల పన్నీట దేల

జాతి సమైక్యత రథం అదే
ఖ్యాతి గడించె రథం అదే

# అమ్మ కావాలి

చిట్టిచెల్లి ఎందుకె ఏడుస్తావు
దిక్కులన్ని వెదకి వెదకి ఏడుస్తావు

చిట్టి పొట్టి బొమ్మలివిగో
చిన్ని చిన్ని పిడతలివిగో
లక్క బొమ్మ కీలుబొమ్మ
గిఱ్ఱున దిరిగె గుఱ్ఱంబొమ్మ
ఏం కావాలీ చెప్పు
ఏది కావాలీ నీకు ?

కారు బస్సు కావాలా
మోటరు సైకిలు కావాలా
విమాన మిదిగో రాకెట్టిదిగో
ఏది కావాలో చెప్పు
ఏం కావాలో నీకు !

పచ్చని చిలకల పందిరదిగో
గలగలలాడె గిలకలు ఇవిగో
రైలుబండి రైఫిల్ అదిగో
రంగు రంగుల బుడగలు అవిగో
గిఱ్ఱున తిరిగె రాట్నం ఇదిగో.

కారు గీరు విమానమొద్దు
పచ్చని చిలకల పందిరి వద్దు
రైలుబండి రాట్నం వద్దు
అమ్మ బొమ్మే కావాలి !
అసలమ్మే నాకు కావాలి! !

# భరతమాత పిల్లలమం

పిల్లలము మేము పిల్లలము
భరతమాత వడిలోని పువ్వులము
మేము పిల్లలము

సన్నజాజి మొగ్గలం
సంపెంగ పూవులం
విరిసిన విరజాజులం
మొగలిపూవు రేకులం

విషవాయువు తరిమికొట్టు
పరిమళించు మల్లెలం
సంధ్యవేళ సాగిపోవు
చిరు పిల్లగాలులం

సలసల కాగే పొంగుల
చల్లార్చె నీటి బిందువులం
రాతిగుండెనైన మేము
కరిగించె సోనలం

చిరుమువ్వల సందడి
చిన్నారి పిల్లలం
ప్రతి యింటిని వెలిగించె
ప్రగతి కాంతి దీపాలం.